## 109. సూరహ్ అల్-కాఫిరూన్




అల్-కాఫిరూన్: సత్యతిరస్కారులు. Deniers of the Truth, The Disbelievers. ఈ సూరహ్ పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇది, సూరహ్ అల్-మా'ఊన్ (107) తరువాత, మొదటి మక్కా కాలంలో అవతరింపజేయబడింది. సత్యధర్మ విషయంలో సమాధానపడటం / రాజీపడటం విశ్వాసులకు తగనిపని. ధర్మ విషయంలో కొంతవరకు రాజీపడమని, మక్కా ముష్రికులు దైవప్రవక్త('స'అస)తో అన్నప్పుడు ఈ సూరహ్ అవతరింపజేయబడింది. 'స'హీ'హ్ 'హదీస్'ల ప్రకారం క'అబహ్'తవాఫ్ తరువాత చేసే రెండు రక'అత్‌లలో, ఫజ్ర్ మరియు మ'గ్‌రిబ్ సున్నత్‌లలో దైవప్రవక్త ('స'అస) ఈ సూరహ్ (109), మరియు సూరహ్ అల్-ఇ'ఖ్లా'స్ (112) పఠించే వారు. అంతేకాదు అతను ('స'అస) తమ అనుచరులకు: "మీరు రాత్రి నిద్రపోయే ముందు ఈ సూరహ్ చదివితే షిర్క్‌నుండి దూరమవుతారు." అని, కూడా ప్రబోధించారు. (ముస్నద్ అ'హ్మద్-5/456, తిర్మిజీ'-3403, అబూ-దావూద్-5055 మొదలైనవి). ఇందులో **6** **ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

قُلْ يٰۤاَيُّهَا الْكٰفِرُوْنَ ①

**1**. ఇలా అను: "ఓ సత్యతిరస్కారులారా!

لَاۤ اَعْبُدُ مَا تَعْبُدُوْنَ ②

**2**. "మీరు ఆరాధిస్తున్న వాటిని నేను ఆరాధించను,

وَلَاۤ اَنْتُمْ عٰبِدُوْنَ مَاۤ اَعْبُدُ ③

**3**. "మరియు నేను ఆరాధిస్తున్న ఆయన (అల్లాహ్)ను మీరు ఆరాధించే వారు కారు.

وَلَاۤ اَنَا عَابِدٌ مَّا عَبَدْتُّمْ ④

**4**. "మరియు మీరు ఆరాధిస్తున్న వాటిని నేను ఆరాధించేవాణ్ణి కాను,

وَلَاۤ اَنْتُمْ عٰبِدُوْنَ مَاۤ اَعْبُدُ ⑤

**5**. "మరియు నేను ఆరాధిస్తున్న ఆయనను మీరు ఆరాధించే వారు కారు.

لَكُمْ دِيْنُكُمْ وَلِيَ دِيْنِ ⑥

**6**. "మీ ధర్మం మీకూ మరియు నా ధర్మం నాకు!"[1]

---

**1**. మీరు మీ ధర్మాన్ని వదలటానికి సిద్ధంగా లేనప్పుడు! నేను నా సత్యధర్మాన్ని ఎందుకు వదలాలి? చూడండి, 28:55.

## 110. సూరహ్ అన్-న'స్ర్



అన్-న'స్ర్: Help, Succour, సహాయం, విజయం, తోడ్పాటు. ఈ సూరహ్ పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇది దైవప్రవక్త ('స'అస) నిర్యాణానికి కొన్ని వారాలముందు, చిట్టచివర అవతరింపజేయబడిన మదీనా సూరహ్. ఇది పదవహిజ్రీలో అవతరింపజేయబడింది. ('స'హీ'హ్ ముస్లిం). ఇందులో 3 ఆయతులు ఉన్నాయి.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

إِذَا جَاءَ نَصْرُ اللَّهِ وَالْفَتْحُ ۝١

1. (ఓ ము'హమ్మద్!) ఎప్పుడైతే అల్లాహ్ సహాయం వస్తుందో మరియు విజయం (లభిస్తుందో)!

وَرَأَيْتَ النَّاسَ يَدْخُلُونَ فِي دِينِ اللَّهِ أَفْوَاجًا ۝٢

2. మరియు నీవు ప్రజలను గుంపులు గుంపులుగా అల్లాహ్ ధర్మం (ఇస్లాం)లో ప్రవేశించడం చూస్తావో![1]

فَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ وَاسْتَغْفِرْهُ ۚ إِنَّهُ كَانَ تَوَّابًا ۝٣

3. అప్పుడు నీవు నీ ప్రభువు స్తోత్రంతోపాటు ఆయన పవిత్రతను కొనియాడు మరియు ఆయన క్షమాభిక్షను అర్థించు. నిశ్చయంగా, ఆయనే పశ్చాత్తాపాన్ని అంగీకరించే వాడు.[2]

## 111. సూరహ్ తబ్బత్



అల్-మసద్: The Palm Fibre, ఖర్జూరపు నార, 5 ఆయతులు గల ఈ సూరహ్ మొదటి మక్కా కాలానికి చెందింది. బహుశా అవతరణలో ఆరవది. దీనిపేరు 5వ ఆయత్ నుండి తీసుకోబడింది. దీని ఇతర పేర్లు సూరహ్ అల్-లహబ్ (అగ్ని జ్వాలలు) మరియు సూరహ్ తబ్బత్ (నాశనమగుట). దీని అవతరణ గురించి ఈ 'హదీస్' ఉంది: దైవప్రవక్త ('స'అస)కు తన దగ్గరి వారికి ఇస్లాం ధర్మప్రచారం చేయటానికి అజ్ఞ దొరికిన తరువాత, అతను 'సఫా గుట్టపైకి ఎక్కి: ''యా 'సబా'హా!'' అంటారు. ఆ కాలంలో ఏదైన ఆపద వస్తే

1. చూడండి, 3:19.
2. అంటే నీ ధర్మ ప్రచారం ముగిసే సమయం వచ్చిందనుకో! కాబట్టి నీవు నీ ప్రభువు పవిత్రతను కొనియాడటంలో మరియు ఆయన స్తోత్రంచేయటంలో మునిగి ఉండు. ప్రతివాడు తన జీవితపు ఆఖరి దినాలలో, వృద్ధాప్యంలో వీలైనంత వరకు ప్రభువు ధ్యానంలో మునిగి ఉండటం ఉత్తమమని, దీని సందేశము.

ఇలా అరిచేవారు. అప్పుడు అందరూ అక్కడ సమావేశమవుతారు. అప్పుడతను అంటారు: "ఓ మక్కా వాసులారా: 'ఈ గుట్ట వెనుక ఒక గుర్రాల సైన్యం మీపై దాడి చేయటానికి సిద్ధంగా ఉంది.' అని, నేను అంటే మీరు నమ్ముతారా?" దానికి వారంటారు: "ఎందుకు నమ్మము. నీవు సదా సత్యమే పలికావు!" అతను అంటారు: "అయితే వినండి! ఒకవేళ మీరు షిర్క్ మరియు కుఫ్ర్ విడువకుంటే మీపై ఘోరశిక్ష పడనున్నదని మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను." అది విని అబూ-లహబ్ అంటాడు: "నీవు నాశనమైపో (తబ్బన్‌లక)! దీనికేనా నీవు మమ్మల్ని ఇక్కడ జమచేసింది?" అప్పుడు ఈ సూరహ్ అవతరింప జేయబడుతుంది, ('స'హీ'హ్ బు'ఖారీ). అబూ-లహబ్ అసలు పేరు అబ్దుల్-'ఉ'జ్జా! తన ఎర్రని రంగురూపుల వల్ల అబూ-లహబ్ అనే మారు పేరుతో పిలవబడ్డాడు. ఇతడు దైవప్రవక్త ('స'అస) పిన్నాన్న. అతని భార్య పేరు ఉమ్మె-జమీల్ బిన్తె 'హర్బ్. వీరిద్దరు అతని ('స'అస) యొక్క క్రూరమైన విరోధులు.

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

1. అబూ-లహబ్ రెండు చేతులూ నశించు గాక మరియు అతడు కూడా నశించిపోవుగాక![1]

تَبَّتْ يَدَآ اَبِيْ لَهَبٍ وَّتَبَّ ﴿١﴾

2. అతని ధనం మరియు అతని సంపాదన (సంతానం) అతనికి ఏ మాత్రం పనికిరావు!

مَآ اَغْنٰى عَنْهُ مَالُهٗ وَمَا كَسَبَ ﴿٢﴾

3. అతడు ప్రజ్వలించే నరకాగ్నిలో కాల్చ బడతాడు!

سَيَصْلٰى نَارًا ذَاتَ لَهَبٍ ﴿٣﴾

4. మరియు అతని భార్య కూడా! కట్టెలు మోసే (చాడీలు చెప్పి కలహాలు రేకెత్తించే) స్త్రీ![2]

وَّامْرَاَتُهٗ ۭ حَمَّالَةَ الْحَطَبِ ﴿٤﴾

5. ఆమె మెడలో బాగా పేనిన ఖర్జూరపు నార త్రాడు (మసద్) ఉంటుంది.[3]

فِيْ جِيْدِهَا حَبْلٌ مِّنْ مَّسَدٍ ﴿٥﴾

---

1. యదా: రెండు చేతులు. అంటే అతడు స్వయంగా! దైవప్రవక్త ('స'అస)ను దూషించినందుకు, అతడు ఈ శాపానికి గురి అవుతాడు. ఫలితంగా అతడు బద్ర్ యుద్ధం జరిగిన కొన్నాళ్ళకే భయంకరమైన వ్యాధికి గురిఅయ్యి చనిపోతాడు. అతని కుమారులు మూడు రోజుల తరువాత అతని శవాన్ని దూరం నుండియే మన్నుపోసి పాతుతారు.
2. ఆమె దైవప్రవక్త ('స'అస) బాటలో ముండ్లువేసేది. అతనికి విరుద్ధంగా చాడీలు చెప్పేది.
3. జీదున్: మెడ. మసదున్: బాగాపేనిన గట్టిత్రాడు.

## 112. సూరహ్ అల్- ఇ'ఖ్లా'స్




అల్-ఇ'ఖ్లా'స్: The Purity, దృఢ విశ్వాసం. దీని మరో పేరు సూరహ్ **అత్-తౌ'హీద్** - Unity, ఏక దైవత్వం. దీనిపేరు దీని తాత్పర్యం నుండి తీసుకోబడింది. ఈ సూరహ్ ఖుర్ఆన్ యొక్క సారం అనబడుతుంది. దైవప్రవక్త ('స'అస) దీనిని 1/3 ఖుర్ఆన్ అన్నారు. ఈ సూరహ్‌ను రాత్రిపూట చదవమని ప్రోత్సహించారు. ('స'హీ'హ్ బు'ఖారీ). ముష్రికులు దైవప్రవక్త ('స'అస)ను నీ ప్రభువు లక్షణాలు చెప్పమని ప్రశ్నించినప్పుడు ఈ సూరహ్ అవతరింపజేయబడింది (ముస్నద్ అ'హ్మద్ 5/133-134). ఈ సూరహ్ మొదటి మక్కా కాలంలో అవతరింపజేయబడింది. కొందరు 'స'హాబీలు ప్రతి రక'అత్‌లో ఇతర సూరాహ్‌ల తరువాత ఈ సూరహ్‌ను చదివేవారు. దానికి దైవప్రవక్త ('స'అస) అన్నారు: "ఈ సూరహ్ పట్ల మీ ప్రేమ మిమ్మల్ని స్వర్గంలో ప్రవేశింప జేస్తుంది." (బు'ఖారీ, ముస్లిం). ఇందులో **4 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

قُلْ هُوَ اللَّهُ أَحَدٌ ﴿١﴾

**1.** ఇలా అను: "ఆయనే అల్లాహ్! ఏకైకుడు.[1]

اللَّهُ الصَّمَدُ ﴿٢﴾

**2.** "అల్లాహ్! ఎవరి అక్కరా లేనివాడు.[2]

لَمْ يَلِدْ وَلَمْ يُولَدْ ﴿٣﴾

**3.** "ఆయనకు సంతానంలేదు (బిడ్డలను కనడు) మరియు ఆయన కూడా ఎవరి సంతానమూ (ఎవరికీ జన్మించిన వాడునూ) కాడు.

وَلَمْ يَكُن لَّهُ كُفُوًا أَحَدٌ ﴿٤﴾

**4.** "మరియు (సర్వ లోకాలలో) ఆయనతో పోల్చదగినది ఏదీ లేదు."[3]

---

**1.** అ'హదున్: The One and Alone, ఏకైకుడు.

**2.** అ'స్సమదు: Absolute, Eternal, Besought of All, to Whom obedience is rendered. Without whom no affair is accomplished. సమస్త వ్యవహారాలు తన మీదనే ఆధారపడి ఉన్నవాడు, నిత్యుడు, శాశ్వితుడు, నిరంతరుడు. అందరూ ఆయనపై ఆధారపడి ఉన్నారు. ఆయనకు ఎవ్వరి అక్కర లేదు. ఆయన నిరపేక్షాపరుడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

**3.** లైస క మిస్'లిహీ షయ్'ఉన్ 42:11. ఒక 'హదీస్'ఖుద్సీ: "మానవుడు నన్ను దూషిస్తాడు, అంటే నాకు సంతానాన్నిఅంటగడతాడు. వాస్తవానికి నేను, ఒక్కడను, అద్వితీయుడను. ఎవరి అక్కరలేనివాడను, నేనెవ్వరినీ కనలేదు మరియు నేను కూడా ఎవ్వరికీ పుట్టలేదు. నాకు సరిసమానమైనవాడుగానీ నాతో పోల్చదగినవాడుగానీ ఎవ్వడూలేడు," ('స. బు'ఖారీ).



## 113. సూరహ్ అల్-ఫలఖ్

అల్-ఫలఖ్: The Day Break, 'సుబ్'హున్, ఉదయం, ప్రభాతం, వేకువజాము, తెల్లవారుజాము అరుణోదయం. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్. ఈ సూరహ్(113) మరియు దీని తరువాత సూరహ్ అన్-నాస్(114)ల యొక్క ఘనతలు ఎన్నో 'హదీస్'లలో పేర్కొనబడ్డాయి. దైవప్రవక్త ('స'అస) అన్నారు: ''ఈ రాత్రి నాపై కొన్ని ఆయతులు అవతరింపజేయబడ్డాయి. ఇటువంటి వాటిని నేను ఎన్నడూ చూడలేదు.'' ఆ తరువాత అతను ఈ రెండు సూరాహ్‌లు పఠించారు ('స. ముస్లిం, తిర్మిజీ'). దైవప్రవక్త ('స'అస) మానవుల మరియు జిన్నాతుల దిష్టినుండి శరణుకోరేవారు. ఈ రెండు సూరాహ్‌లు అవతరింపజేయబడిన తరువాత అతను వీటిని నిత్యం చదివేవారు, (తిర్మిజీ', అల్బానీ - ప్రమాణీకం నం.2150). 'ఆయి'షహ్ (ర. 'అన్హా) కథనం: అతనికి ఏదైనా కష్టం కలిగితే, ము'ఊజ'తేన్ (అల్-ఫలఖ్, అన్-నాస్) సూరాహ్‌లు చదివి తమ దేహంపై ఊదుకునే వారు. అతని కష్టం అధికమైతే నేను ఈ సూరాహ్‌లు చదివి నా చేతులను అతని శరీరం మీద పోనిచ్చే దానిని. (బు'ఖారీ, ముస్లిం). ఇందులో **5** ఆయతులు ఉన్నాయి.

దైవప్రవక్త ('స'అస)కు చేతబడి చేసినప్పుడు జిబ్రీల్ ('అ.స.) వచ్చి అతనితో ఈ రెండు సూరాహ్‌లు చదవమన్నారు. దానితో, ఆ చేతబడి ప్రభావం దూరమయ్యింది ('స.బు'ఖారీ, ముస్లిం). దైవప్రవక్త ('స'అస) ప్రతి రోజూ రాత్రి నిద్రపోక ముందు సూ. అల్-ఇ'ఖ్లా'స్ (112) మరియు ఈ రెండు సూరాహ్‌లు చదివి తమ అరచేతులపై ఊది, వాటితో పూర్తి శరీరం మీద పూసుకునేవారు. మొదట నెత్తి, తరువాత ముఖం, ఆ తరువాత శరీరమంతా. ('స'హీ'హ్ బు'ఖారీ).

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

**1.** ఇలా అను: ''నేను ఉదయకాలపు ప్రభువు అయిన (అల్లాహ్) శరణు వేడుకుంటున్నాను.

**2.** ''ఆయన సృష్టించిన ప్రతిదాని కీడు నుండి;[1]

**3.** ''మరియు చిమ్మచీకటి కీడునుండి, ఎప్పుడైతే అది క్రమ్ముకుంటుందో![2]





---

**1.** ఇక్కడ ప్రతి రకపు కీడునుండి శరణు కోరబడుతోంది. షైతానులనుండి, నరకం నుండి మరియు మానవునికి హాని కలిగించే ప్రతిదాని నుండి.

**2.** ఎందుకంటే చీకటిలోనే హానికరమైన జంతువులు, పాములు, తేళ్ళు బయటికి వస్తాయి. నేరస్థులు రాత్రిలోనే నేరాలుచేస్తారు. ఇక్కడఈ విధమైన అన్ని కీడులనుండి శరణు కోరబడుతోంది.

وَمِنْ شَرِّ النَّفّٰثٰتِ فِي الْعُقَدِ ۝

4. "మరియు ముడుల మీద మంత్రించి ఊదే వారి కీడు నుండి;[1]

وَمِنْ شَرِّ حَاسِدٍ اِذَا حَسَدَ ۝

5. "మరియు అసూయాపరుడి కీడునుండి, ఎప్పుడైతే అతడు అసూయపడతాడో!"[2]

## 114. సూరహ్ అన్-నాస్



అన్-నాస్: Mankind, మానవులు, జనులు. సూరహ్ అల్-ఫలఖ్ (113)తో పాటు, ఈ సూరహ్ మక్కాలో అవతరింపజేయబడింది. మానవుని హృదయంలో ఉండే కీడునుండి మరియు ఇతరుల హృదయాలలో ఉండే కీడునుండి శరణుకోరుకోమని ప్రబోధించబడింది. దీని ఘనత ఇంతకు ముందు సూరహ్‌లో పేర్కొనబడింది. ఒకసారి దైవప్రవక్త ('స'అస) నమా'జ్ చేస్తూ ఉండగా అతనికి తేలు కుట్టింది. నమా'జ్ పూర్తి చేసిన తరువాత అతను నీటిలో ఉప్పు కలిపి గాయం మీద పూస్తూ అల్-కాఫిరూన్ (109), అల్-ఇ'ఖ్లా'స్ (112) మరియు అన్-నాస్ (114) సూరాహ్‌లు చదివారు. (ముజమ్మ'అ అ'జ్జవాయి'ద్, 5/111). ఇందులో **6 ఆయతులు** ఉన్నాయి.



అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

قُلْ اَعُوْذُ بِرَبِّ النَّاسِ ۝

1. ఇలా అను: "నేను మానవుల ప్రభువు (అల్లాహ్)ను శరణుకై వేడుకుంటున్నాను![3]

مَلِكِ النَّاسِ ۝

2. "మానవుల సార్వభౌముడు![4]

اِلٰهِ النَّاسِ ۝

3. "మానవుల ఆరాధ్య దైవం (అయిన అల్లాహ్ యొక్క శరణు)!

مِنْ شَرِّ الْوَسْوَاسِ ۙ الْخَنَّاسِ ۝

4. "కలతలు రేకెత్తించి తొలగిపోయేవాని కీడు నుండి;

---

1. అన్-నఫ్ఫాసా'త్: అంటే ముడుల మీద మంత్రించి ఊదేవారి కీడు నుండి.
2. 'హాసిదిన్: అసూయపడే వాడి కీడునుండి కూడా శరణుకోరబడుతోంది.
3. రబ్బున్: పర్వర్దిగార్ (ఉర్దూలో), పోషకుడు, చాలా మట్టుకు తెలుగు అనువాదాలలో ఈ పదానికి ప్రభువు అని అనువాదం చేశారు. మానవుడు తన తల్లి గర్భంలో ఉన్నప్పటి నుండి వానిని సరిదిద్ది పోషిస్తాడు. మరియు అతని అంతిమ ఘడియ వరకు పోషిస్తాడు. కేవలం మానవుడే కాక సమస్త సృష్టికి కూడా పోషకుడు ఆయనే!
4. ఇటువంటి పోషకుడే వారి సార్వభౌముడు.

ٱلَّذِى يُوَسْوِسُ فِى صُدُورِ ٱلنَّاسِ ۝

5. "ఎవడైతే మానవుల హృదయాలలో కలతలు రేకెత్తిస్తాడో![1]

مِنَ ٱلْجِنَّةِ وَٱلنَّاسِ ۝

6. "వాడు జిన్నాతులలోని వాడూ కావచ్చు లేదా మానవులలోని వాడూ కావచ్చు!"[2]

---

1. అల్-వస్వాస: అంటే మెల్లని ధ్వనితో మాట్లాడటం, గుసగుసలాడటం. షైతాన్ కూడా మానవునికి తెలియకుండానే అతని హృదయంలో చెడ్డ ఆలోచనలు రేకెత్తిస్తాడు, ఇదే వస్వస.
అల్-ఖన్నాస్: నెమ్మదిగా జారుకునే వాడు, అంటే షైతాన్.

2. ఈ వస్వస - చేసేవారు రెండు రకాల వారు. ఒకరు జిన్నాతులలోని షైతానులు. అల్లాహ్ (సు.తా.) వాటికి మానవులను, మార్గభ్రష్టత్వంవైపుకు ఆకర్షించే యుక్తిని ఇచ్చాడు. ప్రతి మానవుని వెంట ఒక షైతాన్ ఉంటాడు. వాడు అతన్ని మార్గభ్రష్టత్వంవైపుకు ఆకర్షిస్తూ ఉంటాడు. ఈ మాట విని ఒక సహాబీ (ర'ది.'అ.) ఇలా అడిగారు: "ఓ ప్రవక్తా ('స'అస) ఏమీ? మీతో పాటు కూడా ఒక షైతాన్ ఉన్నాడా?" అతను జవాబిచ్చారు: "అవును! ఉన్నాడు కాని, అల్లాహ్ (సు.తా.) నాకు వాడిపై ఆధిక్యతనిచ్చాడు అందుకని వాడు నాకు విధేయుడిగా ఉంటాడు. వాడు, నాకు మేలు తప్ప మరొక విషయాన్ని ప్రోత్సహించడు." ('స'హీ'హ్ ముస్లిం).
రెండవ రకమైన షైతాన్లు మానవులలో ఉన్నారు. వారు, తాము మంచి ఉపదేశం ఇస్తున్నామని చెబుతూ మానవులను మార్గభ్రష్టత్వం వైపుకు ఆకర్షిస్తూ ఉంటారు.
షైతాన్ మానవులనే కాక జిన్నాతులను కూడా మార్గభ్రష్టత్వం వైపుకు ఆకర్షిస్తూ ఉంటాడని మరి కొందరి అభిప్రాయం.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

# رِوَايَةُ هَذَا الْمُصْحَفِ

## అరబ్బీలో అవతరింపజేయబడిన ఈ ఖుర్ఆన్ విశేషాలు

ఈ ఖుర్ఆన్ లిపి 'హఫ్'స్ బిన్ సులైమాన్ ఇబ్నె అల్-ముగైరహ్ అల్-అసది అల్-కూఫీ రివాయత్ ప్రకారం - 'ఆ'సిమ్ బిన్ అబీ అన్-నజూద్ అల్-కూఫీ అత్-తాబ'ఈ గారు అనుసరించిన, అబీ అబ్దుర్ర'హ్మాన్ 'అబ్దుల్లాహ్ బిన్ 'హబీబ్ అస్సులమీ గారి పారాయణాధారంగా - అంటే అతడు (అబీ 'అబ్దుర్ర'హ్మాన్ 'అబ్దుల్లాహ్ బిన్ 'హబీబ్ అస్సులమీ) అనుసరించిన; 'ఉస్మాన్ బిన్ 'అఫ్ఫాన్, 'అలీ బిన్ అబీ 'తాలిబ్, 'జైద్ బిన్ సా'బిత్ మరియు ఉబై బిన్ క'అబ్ (ర'ది.'అన్హుమ్)లు, దైవ ప్రవక్త ('స'అస) నుండి నేర్చుకున్న - పారాయణాన్ని బట్టి ఉంది.

ఈ ఖుర్ఆన్ అక్షరాల సముదాయం (హిజాఅ'హ్) 'ఖలీఫతుర్రాషిద్ 'ఉస్మాన్ బిన్ 'అఫ్ఫాన్ (ర'ది.'అ.) - బ'సరహ్, కూఫా, షామ్ మరియు మక్కాలకు పంపిన, మదీనాలోఉంచిన మరియు తనదగ్గర ఉంచుకున్న - ఖుర్ఆన్‌లలో ఉన్నట్లే ఉంది. అంటే వాటిలోని ఒక ఖుర్ఆన్ నుండి అబూ-'అమ్రూ అద్దానీ మరియు అబూ-దావూద్ సులైమాన్ బిన్ నజా'హ్ కాపీ చేసిన ఖుర్ఆన్‌లను అనుసరించి ఉంది. వారిద్దరి కాపీల మధ్య భేదాలుంటే అబూ-దావూద్ సులైమాన్ బిన్ నజా'హ్ గారి కాపీకీ, ప్రాధాన్యత ఇవ్వబడింది.

ఈ విధంగా ఈ ఖుర్ఆన్‌లో ఉన్న అక్షరాలన్నీ 'ఉస్మానీయ 6 ఖుర్ఆన్‌లలో ఉన్నట్లే ఉన్నాయి.

ఈ ఖుర్ఆన్‌లోని వత్తుల ('తరీఖయే 'ద'బ్త్ అంటే 'జేర్, 'జబర్, పేష్ మొదలైన సంకేతాల) విధానం, 'ఉలెమాయే 'ద'బ్త్, ఖరారుచేసిన సంకేతాలు, అంటే ఇమామ్ అత్తనస్సీ యొక్క అ'త్తరా'జ్ 'అలా 'ద'బ్త్ అల్-'ఖరా'జ్‌లో వ్రాయబడిన విధానాన్ని అనుసరించి ఉంది. ఇందులోని సంకేతాలు ('అలామాత్), అల్-'ఖలీల్ బిన్ అ'హ్మద్ మరియు అతనిని అనుసరించిన తూర్పుదిశ 'ఉలమాలు ఉపయోగించిన విధానాన్ని అనుసరించి ఉన్నాయి.

ఈ ఖుర్ఆన్‌లోని ఆయతుల సంఖ్య కూఫీ 'ఉలమాలు అనుసరించిన

ఇమామ్ అష్షా'తబీ యొక్క నా''జిమతు'జ్జుహర్‌లో వ్రాసినట్లు ఉంది. అంటే అబీ అబ్దుర్ర'హ్మాన్ 'అబ్దుల్లాహ్ బిన్ 'హబీబ్ అస్సులమీ అనుసరించిన, 'అలీ బిన్ అబీ 'తాలిబ్, (ర'ది.'అ.) విధానము. దీని ప్రకారం ఈ ఖుర్ఆన్‌లోని ఆయతుల సంఖ్య 6236.

ఈ ఖుర్ఆన్‌లోని 30 భాగాలు (అజ్'జా'), 60 విభాగాలు (అ'హ్'జాబ్), మరియు ప్రతి విభాగపు నాలుగవ (1/4) భాగపు ఆయత్ ప్రారంభమయ్యేచోట్ల విభజన గైస్' అన్నఫ'అ లిల్'అలామతుస్సఫాఖుసియ్యి మరియు ఇమామ్ అష్షా'తబీ యొక్క నా''జిమతు'జ్జుహర్ మరియు షే'ఖ్ ము'హమ్మద్ ముతవల్లీ యొక్క త'హ్ఖీఖ్ అల్-బయాన్ మరియు అబీ 'ఈద్ రి'ద్వాన్ అల్-ము'ఖల్లలాతీ యొక్క ఇర్షాద్ అల్-ఖరాఅ' వల్ కాతిబీన్‌లను అనుసరించి ఉన్నాయి.

అవతరణ కాలం ''మక్కీ'' లేక ''మదనీ'' అనే నిర్ణయం, అబీ అల్-ఖాసిమ్ 'ఉమర్ బిన్ ము'హమ్మద్ బిన్ 'అబ్దుల్ కాఫీ మరియు భిన్నాభిప్రాయాలు ఉన్నచోట్లలో, ఇతర ఖరాఅ'త్ వత్తఫ్సీర్ గ్రంథాల నుండి తీసుకోబడింది.

విరామ (వఖూఫ్) స్థలాలు మరియు వాటి చిహ్నాలను, 'ఉలమాఅ' అల్-ముఫస్సిరీన్ మరియు 'ఉలమాఅ' అల్-వఖ్ఫ్ వల్ ఇబ్తిదాఅ'ల ఒక ప్రత్యేక సభ (కమిటీ), నిర్ణయానుసారంగా ఇవ్వబడ్డాయి.

సజ్దా స్థలాల నిర్ధారణ ఫిఖ్‌హ్ మరియు 'హదీస్' గ్రంథాలను అనుసరించి చేయబడింది. ఐదు చోట్లలో భేదాభిప్రాయాలున్నాయి, అవి: 1) సూరహ్ అల్-'హజ్జ్ యొక్క రెండవ సజ్దా, 2) సూరహ్ 'సాద్, 3) సూరహ్ అన్నజ్మ్, 4) సూరహ్ అల్-ఇన్షిఖాఖ్ మరియు 5) సూరహ్ అల్-'అలఖ్ యొక్క సజ్దాలు.

{*} ఈ విధమైన చిహ్నాలు, భాగ విభాగాలు మరియు వాటి 1/4 విభాగాల మొదటి ఆయత్ ప్రారంభంలో ఇవ్వబడ్డాయి.

{[illegible]} ఈ విధమైన చిహ్నాలు, సజ్దా చేయవలసిన పదం వచ్చిన, వాక్యపు చివరలో ఇవ్వబడ్డాయి.

*****

# విరామ చిహ్నాలు عَلَامَاتُ الوَقْفِ

(O) وقف تام : ఈ చిహ్నం ప్రతి ఆయత్ చివరలో ఉంటుంది. ఇక్కడ ఆగాలి.

(ه) وقف عند غیرالکوفیین : ఈ చిహ్నం ఉన్నచోట కూఫియేతరులవద్ద ఆయత్ పూర్తి అవుతుంది.

(م) وقف لازم: ఈ చిహ్నం ఉన్నచోట తప్పనిసరిగా ఆగాలి. ఆగకుంటే అర్థంలో భేదం రావచ్చు.

(ط) وقف مطلق : ఈ చిహ్నం ఉన్నచోట ఆగాలి కాని మాట ఇంకా పూర్తికాదు.

(ج) وقف جائز : ఈ చిహ్నం ఉన్నచోట ఆగటం ఉచితం కాని ఆగకుంటే ఫర్వాలేదు.

(ز) وقف مجوز : ఈ చిహ్నం ఉన్నచోట ఆగకుండా చదవటం ఉచితం.

(ص) وقف مرخص : ఈ చిహ్నం ఉన్నచోట కలిపి చదవాలి, కాని అలిసిపోతే ఆగవచ్చు. కలిపి చదవటమే మేలు.

(صلے) الوصل اولی: ఈ చిహ్నం ఉన్నచోట కలిపి చదువుట ఉత్తమం.

(ق) قیل علیه الوقف : ఇలాంటి చిహ్నం ఉన్నచోట ఆగరాదు.

(صل) قد یوصل : ఈ చిహ్నం ఉన్నచోట ఆగవచ్చు, కలిపి కూడా చదవవచ్చు. అవసరముంటే ఆగవచ్చు.

(قف) : ఈ చిహ్నం ఉన్నచోట తప్పక ఆగాలి. అనుకోకుండా కలిపి చదువబడే చోట ఇలాంటి చిహ్నం ఉంటుంది.

(سکتة) : ఈ చిహ్నం ఉన్నచోట కొంత ఆగాలి, కాని ఊపిరి తెగరాదు.

(وقفة) : ఇది దీర్ఘ సక్తహ్ (سکتة)ను సూచిస్తుంది. అంటే కొంత ఎక్కువ కాలం ఆగవచ్చు కాని ఊపిరి తెగరాదు.

(لا) : ఇలాంటి చిహ్నం ఆయత్ చివరలో ఉంటే ఆగవచ్చు, కాని ఆయత్ మధ్యలో ఉంటే ఆగరాదు.

(∴ ∴) : ఇలాంటి చిహ్నాలు ఉన్నచోట, రెండింటిలోనుండి ఒకదానిపై ఆగితే రెండవదానిపై ఆగరాదు.

*****

## TELUGU TRANSLITERATION OF ARABIC ALPHABETS

## అరబ్బీ అక్షరాల తెలుగు అక్షరాలలో ప్రతిలేఖనం

| 'ఖ | خ | 'హ | ح | జ | ج | స' | ث | త | ت | బ | ب | అ | ا |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 'స | ص | ష | ش | స | س | 'జ | ز | ర | ر | జ' | ذ | ద | د |
| ఖ | ق | ఫ | ف | 'గ | غ | 'అ | ع | ''జ | ظ | 'త | ط | 'ద | ض |
| య | ي | వ | و | హ | ه | న | ن | మ | م | ల | ل | క | ك |

| ద | د | 'ఖ | خ | 'హ | ح | జ | ج | స' | ث | త | ت | అ | ا |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 'ద | ض | ఖ | ق | హ | ه | జ' | ذ | స | س | 'త | ط | 'అ | ع |
| | | | | హ్ | ة | 'జ | ز | 'స | ص | | | అ' | ء |
| | | | | | | ''జ | ظ | | | | | | |

# సూరహ్ సూచిక     فِهرِسٌ بِأَسْمَاءِ السُّوَرِ

| నం | సూరహ్ | అవతరణ | పుట | భాగం | السُّوَرَة |
|---|---|---|---|---|---|
| 28 | అల్-ఖ'స'స్ | మక్కా | 757 | 20 | سورة القصص |
| 29 | అల్-'అన్కబూత్ | మక్కా | 779 | 20-21 | سورة العنكَبوت |
| 30 | అర్-రూమ్ | మక్కా | 795 | 21 | سورة الرُّوم |
| 31 | లుఖ్మాన్ | మక్కా | 808 | 21 | سورة لقمان |
| 32 | అస్-సజ్దహ్ | మక్కా | 816 | 21 | سورة السَّجدَة |
| 33 | అల్-అ'హ్'జాబ్ | మదీనా | 823 | 21-22 | سورة الأحزَاب |
| 34 | సబా' | మక్కా | 845 | 22 | سورة سبا |
| 35 | ఫా'తిర్ | మక్కా | 858 | 22 | سورة فاطر |
| 36 | యా-సీన్ | మక్కా | 870 | 22-23 | سورة يٰسٓ |
| 37 | అ'స్-'సాఫ్ఫాత్ | మక్కా | 883 | 23 | سورة الصافات |
| 38 | 'సాద్ | మక్కా | 903 | 23 | سورة صٓ |
| 39 | అ'జ్-'జుమర్ | మక్కా | 917 | 23-24 | سورة الزُّمر |
| 40 | 'గాఫిర్ | మక్కా | 935 | 24 | سورة المؤمن |
| 41 | ఫు'స్సిలత్ | మక్కా | 954 | 24-25 | سورة حٰمٓ السجدة |
| 42 | అష్-షూరా | మక్కా | 967 | 25 | سورة الشُّورٰى |
| 43 | అ'జ్- 'జు'ఖ్రుఫ్ | మక్కా | 981 | 25 | سورة الزُّخرُف |
| 44 | అద్-దు'ఖాన్ | మక్కా | 996 | 25 | سورة الدُّخان |
| 45 | అల్-జాసి'యహ్ | మక్కా | 1003 | 25 | سورة الجاثية |
| 46 | అల్-అ'హ్ఖాఫ్ | మక్కా | 1010 | 26 | سورة الأحقاف |
| 47 | ము'హమ్మద్ | మదీనా | 1020 | 26 | سورة مُحمَّد |
| 48 | అల్- ఫత్'హ్ | మదీనా | 1029 | 26 | سورة الفتح |
| 49 | అల్-'హుజురాత్ | మదీనా | 1039 | 26 | سورة الحجرات |
| 50 | ఖాఫ్ | మక్కా | 1045 | 26 | سورة قٓ |
| 51 | అజ్-జా'రియాత్ | మక్కా | 1052 | 26-27 | سورة الذّاريات |
| 52 | అ'త్-'తూర్ | మక్కా | 1060 | 27 | سورة الطور |
| 53 | అన్-నజ్మ్ | మక్కా | 1066 | 27 | سورة النّجم |
| 54 | అల్-ఖమర్ | మక్కా | 1075 | 27 | سورة القَمر |
| 55 | అర్-ర'హ్మాన్ | మదీనా | 1083 | 27 | سورة الرَّحمٰن |
| 56 | అల్-వాఖి'అహ్ | మక్కా | 1092 | 27 | سورة الوَاقعة |

| నం | సూరహ్ | అవతరణ | పుట | భాగం | السُّورَة |
|---|---|---|---|---|---|
| 57 | అల్-'హదీద్ | మదీనా | 1101 | 27 | سورة الحديد |
| 58 | అల్-ముజాదలహ్ | మదీనా | 1111 | 28 | سورة المجادلة |
| 59 | అల్-'హష్ర్ | మదీనా | 1118 | 28 | سورة الحشر |
| 60 | అల్-ముమ్తహినహ్ | మదీనా | 1126 | 28 | سورة الممتحنة |
| 61 | అ'స్-'సఫ్ఫ్ | మదీనా | 1132 | 28 | سورة الصف |
| 62 | అల్-జుము'అహ్ | మదీనా | 1136 | 28 | سورة الجمعة |
| 63 | అల్-మునాఫిఖూన్ | మదీనా | 1139 | 28 | سورة المنافقون |
| 64 | అత్-త'గాబున్ | మదీనా | 1142 | 28 | سورة التغابن |
| 65 | అ'త్-'తలాఖ్ | మదీనా | 1146 | 28 | سورة الطلاق |
| 66 | అత్-త'హ్రీమ్ | మదీనా | 1151 | 28 | سورة التحريم |
| 67 | అల్ముల్క్ | మక్కా | 1156 | 29 | سورة الملك |
| 68 | అల్-ఖలమ్ | మక్కా | 1162 | 29 | سورة القلم |
| 69 | అల్-'హాఖ్ఖహ్ | మక్కా | 1169 | 29 | سورة الحاقة |
| 70 | అల్-మ'ఆరిజ్ | మక్కా | 1175 | 29 | سورة المعارج |
| 71 | నూ'హ్ | మక్కా | 1180 | 29 | سورة نوح |
| 72 | అల్-జిన్న్ | మక్కా | 1184 | 29 | سورة الجنّ |
| 73 | అల్-ము'జ్జమ్మిల్ | మక్కా | 1190 | 29 | سورة المزمل |
| 74 | అల్-ముద్దస్సి'ర్ | మక్కా | 1194 | 29 | سورة المدثر |
| 75 | అల్-ఖియామహ్ | మక్కా | 1200 | 29 | سورة القيامة |
| 76 | అల్-ఇన్సాన్ | మదీనా | 1204 | 29 | سورة الدهر |
| 77 | అల్-ముర్సలాత్ | మక్కా | 1209 | 29 | سورة المرسَلات |
| 78 | అన్-నబా' | మక్కా | 1214 | 30 | سورة النبأ |
| 79 | అన్-నా'జి'ఆత్ | మక్కా | 1218 | 30 | سورة النازعات |
| 80 | 'అబస | మక్కా | 1222 | 30 | سورة عبسَ |
| 81 | అత్-తక్వీర్ | మక్కా | 1226 | 30 | سورة التكوير |
| 82 | అల్-ఇన్ఫితార్ | మక్కా | 1229 | 30 | سورة الإنفطار |
| 83 | అల్-ము'తఫ్ఫిఫీన్ | మక్కా | 1231 | 30 | سورة المطففين |
| 84 | అల్-ఇన్షిఖాఖ్ | మక్కా | 1235 | 30 | سورة الانشقاق |
| 85 | అల్-బురూజ్ | మక్కా | 1237 | 30 | سورة البرُوج |

| నం | సూరహ్ | అవతరణ | పుట | భాగం | السُّورَة |
|---|---|---|---|---|---|
| 86 | అ'త్-'తారిఖ్ | మక్కా | 1240 | 30 | سورة الطارق |
| 87 | అల్-అ'అలా | మక్కా | 1242 | 30 | سورة الأعلىٰ |
| 88 | అల్-'గాషియహ్ | మక్కా | 1244 | 30 | سورة الغاشية |
| 89 | అల్-ఫజ్ర్ | మక్కా | 1246 | 30 | سورة الفجر |
| 90 | అల్-బలద్ | మక్కా | 1249 | 30 | سورة البلد |
| 91 | అష్-షమ్స్ | మక్కా | 1251 | 30 | سورة الشّمس |
| 92 | అల్-లైల్ | మక్కా | 1253 | 30 | سورة الليل |
| 93 | అ'ద్-'దుహా | మక్కా | 1255 | 30 | سورة الضحىٰ |
| 94 | అష్-షర్'హ్ | మక్కా | 1256 | 30 | سورة ألم نشرح |
| 95 | అత్-తీన్ | మక్కా | 1257 | 30 | سورة التين |
| 96 | అల్-'అలఖ్ | మక్కా | 1258 | 30 | سورة العلق |
| 97 | అల్-ఖద్ర్ | మక్కా | 1261 | 30 | سورة القدْر |
| 98 | అల్-బయ్యినహ్ | మదీనా | 1262 | 30 | سورة البينة |
| 99 | అ'జ్-'జల్'జలహ్ | మదీనా | 1263 | 30 | سورة الزّلزال |
| 100 | అల్-'ఆదియాత్ | మక్కా | 1264 | 30 | سورة العاديات |
| 101 | అల్-ఖారి'అహ్ | మక్కా | 1266 | 30 | سورة القارعة |
| 102 | అత్-తకాసు'ర్ | మక్కా | 1267 | 30 | سورة التّكاثر |
| 103 | అల్-'అస్ర్ | మక్కా | 1268 | 30 | سورة العصر |
| 104 | అల్-హుమ'జహ్ | మక్కా | 1269 | 30 | سورة الهمزة |
| 105 | అల్-ఫీల్ | మక్కా | 1270 | 30 | سورة الفيل |
| 106 | ఖురైష్ | మక్కా | 1271 | 30 | سورة قريش |
| 107 | అల్-మా'ఊన్ | మక్కా | 1272 | 30 | سورة الماعون |
| 108 | అల్-కౌస'ర్ | మక్కా | 1273 | 30 | سورة الكوثر |
| 109 | అల్-కాఫిరూన్ | మక్కా | 1274 | 30 | سورة الكافرون |
| 110 | అన్-న'స్ర్ | మదీనా | 1275 | 30 | سورة النصر |
| 111 | అల్-మసద్ | మక్కా | 1275 | 30 | سورة تبّت |
| 112 | అల్-ఇ'ఖ్లా'స్ | మక్కా | 1277 | 30 | سورة الإخلاص |
| 113 | అల్-ఫలఖ్ | మక్కా | 1278 | 30 | سورة الفلق |
| 114 | అన్-నాస్ | మక్కా | 1279 | 30 | سورة النّاس |

إن وزارة الشؤون الإسلامية والأوقاف والدعوة والإرشاد

في المملكة العربية السعودية

المشرفة على مجمع الملك فهد

لطباعة المصحف الشريف في المدينة المنورة

إذ يسرها أن يصدر المجمع هذه الطبعة من القرآن الكريم

وترجمة معانيه إلى لغة التلغو

تسأل الله تعالى أن ينفع به الناس

وأن يجزي

خادم الحرمين الشريفين الملك عبد الله بن عبد العزيز آل سعود

أحسن الجزاء على جهوده العظيمة في نشر كتاب الله الكريم

والله ولي التوفيق

మదీనా మునవ్వరాలోని "మహారాజు ఫహద్ దివ్యఖుర్ఆన్ ప్రచురణా కేంద్రంపు" పర్యవేక్షకులైన, స'ఊదీ 'అరేబియా రాజ్యపు, ఇస్లామీయ వ్యవహారాలు, అవ్ఖాఫ్, ద'అవహ్ మరియు మార్గదర్శకపు మంత్రి మండలానికి, దివ్యఖుర్ఆన్ భావాన్ని తెలుగులో, "దివ్యఖుర్ఆన్ సందేశం" పేరుతో ప్రచురించడం ఎంతో సంతోషకరమైన విషయం. అల్లాహుతా'ఆలా దీనిని మానవాళికి లాభదాయకమైనదిగా చేసి, 'ఖాదిముల్ 'హరమైన్ అష్షరీఫైన్, మహారాజు అబ్దుల్లాహ్ బిన్ అబ్దుల్ అజీజ్ ఆల స'ఊద్ గారి అల్లాహుతా'ఆలా గ్రంథాన్ని (దివ్యఖుర్ఆన్‌ను) వీలైనంతవరకు ప్రజలకు అందజేయటానికి చేస్తున్న ఎడతెగని కృషికి అత్యోత్తమ ప్రతిఫలం ప్రసాదించుగాక! లక్ష్యసిద్ధి పూర్తిచేయగలవాడు కేవలం అల్లాహుతా'ఆలా మాత్రమే.






పోస్ట్ బాక్స్ 6262, మదీనహ్ మునవ్వరహ్
**www.qurancomplex.org**
**kfcphq@qurancomplex.org**

